



కత్తి పద్మారావు

లోకాయత ప్రచురణలు

ప్రథమ ముద్రణ అక్టోబరు 1979
ద్వితీయ ముద్రణ ఆగష్టు 1983

ప్రతులు : వెయ్యి

వెల : రు. 3-00

ప్రతులకు :
లోకాయత ప్రచురణలు
కె. చార్వాకుడు
విద్యానగర్
నిడుబ్రోలు-522 123.
గుంటూరు జిల్లా

ముద్రణ : శారదా ప్రెస్, పొన్నూరు.

# ఒక మాట

హేతువాద ఉద్యమం ఆంధ్రదేశంలో విస్తృతంగా వ్యాప్తి చెందుతున్న ఈ దశాబ్దంలో ఎన్నో సభలలో ఈ గేయాలు చదవడం జరిగింది. హేతువాద సంఘ సభ్యులు, వివిధ సాంస్కృతిక దళాలవారు సాంఘిక ఉద్యమాన్ని వ్యాప్తి చేసే క్రమంలో ఈ గేయాలను గుండెడప్పులతో ప్రయోగించారు. హేతువాద ఉద్యమం చారిత్రక అవసరంగా అభివృద్ధి చెందుతున్న ఈనాడు ఈగేయసంపుటిని పునర్ముద్రించడం అవసరం అయ్యింది. 1979 నుండి 1983 వరకు వ్రాసిన గేయాలనుకూడా ఇందులో పొందుపరచడమైనది. మునుపటివలెనే ఈ గేయసంపుటిని హేతువాద, సాంస్కృతిక ఉద్యమకారులు ఆదరిస్తారని ఆశిస్తున్నాను. మొదటి ముద్రణలోవున్న పీఠికలను గ్రంథాన్ని తక్కువ వెలకు పాఠకుల కందించాలనే ఉద్దేశ్యంతో పునర్ముద్రించుటలేదు. ఈ గ్రంథానికి సంబంధించిన సద్విమర్శలను కోరుతూ....

రచయిత

---

# కారల్ మార్క్సుకు...

---

# ఇందులో

పేజి

# జనగీతం

ఈనాడు నేను కొనియాడలేను
రంభా రంభోరు సౌభాగ్య గరిమ
ఈనాడు నేను నుతియించలేను
పురా వైభోగ కళా సౌభాగ్య మహిమ
ఈనాడు ప్రణయ కవితా మరీచికల తూగలే
శృంగార రస మదోన్మత్త
భృంగాన్నయి తిరుగాడలేను

అందుకే
అనంగుని కేళీ విలాస వినోదముల
నేనాలాపించలేను
సత్యానికి దూరమైన ప్రతిదాన్నీ
అలంకారంగా నేనంగీకరించలేను
ఆలోచన కందని ఆత్మని
అనుభవానికందని అనుభూతిని
అర్థంలేని శబ్ద సౌందర్యంతో
మురిపించలేను

అందుకే
నేనుపాడాలి నిజంగా
క్షుద్బాధానల తప్తోదరాల ఉదంతాలు
నేను వ్రాయాలి నిజంగా
భావ దాస్య శృంఖలాబద్ధ
ప్రజా విముక్తి సూక్తాలు
నేను పాడాలి నిజంగా
కడుపు కూటికి కాయాన్ని

రక్కసులకు బలియిచ్చే
భరత వనితా జనతా
బాధా తరంగాలు
నేను కూయాలి నిజంగా
కన్నబిడ్డలకు దోసెడు
గంజి పోయలేక
స్వహస్త్రాలతో విషదగ్ధులను చేసిన
తల్లి అంతరాంతరాల్లో
రగిలే సెగల మూలుగులు
నేను వ్రాయాలి నిజంగా
వరకట్న పీడితయై
అత్తమామల రాపిడులు
త్రాగుబోతు భర్త తాడనలు
భరించలేక ఉరివేసుకొన్న
ఇల్లాలి హృదయోద్రేకాలు

అదుగో
ఎండిపోయిన తల్లి గుండెపై
పండి పాలుగుంజే బిడ్డడు
చుక్కరాక కుతితీరక
గుద్దుతున్నా డాగుండెనే
ఏమిటీ అన్యాయమని

అవిగో
క్షయగ్రస్తుడైన భర్త
కలుషిత రక్తపు కళ్ళేలతో
భూమి తడిసిపోతుంటే
అమ్మడానికి పుస్తె లేని
అభాగ్యురాలి దీనార్తనాదాలు

అదిగో
పులి స్తర్ల కుండీల మూగిన
మన సోదర భారతీయుల
దీనరూపాలు
ఈ దేశ భాగ్యోన్నతికి నిదర్శనాలు

ఓహో నాదేశం
ఆధ్యాత్మిక చింతనాంధకార పూరితం
నిర్జీవ నిద్రాణ నీరవోన్మాద సహితం
దీన హీనోద్విగ్న హృదంతర ప్రభంజన సంయుతం

అందుకే
చైతన్యశంఖం పూరించాలి
సమసమాజ నిర్మాణచణులై
గమించాలి
గుండెలోతులనుండి భావం
చీల్చుకురావాలి
వ్యథార్త హృదాయలకోసం
కలం పరుగులుతీయాలి
జనగీతం—జననాదం
జనసాహితీ సృజనం
ప్రజాకవుల ధ్యేయం.

"అభ్యుదయ"- అక్టోబరు 1978

# చైతన్యదీప్తి

హేతువాదం కావాలి
మ(గ)తవాదం పోవాలి
నరజాతిలో నవశక్తి నవజీవం రావాలి

వేసే ప్రతి అడుగును ఎందుకని యోచించి
చేసే ప్రతి పనిని ఏమిటని తర్కించి
అడుగడుగున అడ్డు తగిలే
ఆచారపు టడ్డు గోడ
లెవరి నిర్మాణమని ప్రశ్నించే చైతన్యం కావాలి

గతమంతా నిండింది
పురాణాల బూజులతో
బూతుకథల మోజులతో
ఆలినెవడో ఎత్తుకెళితే
అంగలార్చే అర్భకుని
దేవుడంటూ కొలిచే
మతవాది మారాలి!
హేతువాది కావాలి!

కులాలను నిలవేసి
మతాలను జతకలిపి
మనిషి మనిషికెంతో దూరాన్ని పెంచేసిన
వంచకుల ఉదంతాల్ని బట్టబయలుచేసే
హేతువాదం కావాలి!
మతవాదం పోవాలి!

మనిషి మనిషి మధ్యనున్న అగాధన్ని పూడ్చేసి
సేతువును నిర్మించే హేతువాది కావాలి!

అసలువారు ఎనిమిదంట
పైనోళ్ళు పదునారు వేలంట
అతడు చీరలెత్తుకెళ్ళేపాట
చిత్రంగా పాడుకుంటు
వెట్టి మొట్టి కథలకు
బుజ్జలమ్ముకొన్నట్టి
వేదాంతి మారాలి!
హేతువాది కావాలి!

చిలిపిరాళ్ళు నిలబెట్టి
కొలుపులెన్నో చేస్తారు
బూతులెన్నో కలబోసి
నీతులెన్నో చెబుతారు
అందుకే
మతవాదం
గతవాదం
మృతభావం
నతజీవం
సమాధి కావాలి
సమసమాజ నిర్మాణపు
చైతన్యం రావాలి!

వేదనింద వొద్దొద్దని
విప్రనింద కూడదని
విదురనీతులొల్లించే

విషపూరిత మతవిమతులు
ధర్మాన్ని బోధించి
కర్మాన్ని ముడివేసి
సర్వాన్ని హరియించి
గానుగలో ఎద్దులుగా మొద్దులుగా తిప్పారు

జాతికంతా గంతకట్టి
తామే అధిపతులమని
శాసించే పురోహితుని
నిలదీసి అడగవోయ్
మీ మోసం ఎన్నాళ్ళకు సమసిపోతుందని
ఈ జాతి ఎన్నాళ్ళకు కళ్ళు తెరుస్తుందని

కలకత్తా కాళికా కళ్ళురిమి చూస్తుంది
పసికందుల నెత్తుటిని జుర్రుకుంటానంటుంది
గుర్రుపోతు నిద్రనున్న వెర్రి ఓ మానవుడా!
ఆచారపు మారెమ్మలు జూలుదులిపి కదిలాయోయ్
కదలాలోయ్ మానవుడా! హేతువాద బాపుటాతో
ఘీంకరించి— హూంకరించి
మారెమ్మల— గీరెమ్మల
పారద్రోల కదలాలి
జాతిలో చైతన్యం
అడుగడుగునా ఉప్పొంగి
ప్రగతిపథంలో జాతిని
నడిపించగ కదలాలోయ్!
నడిపించగ కదలాలోయ్!

"చార్వాక"— ఆగష్టు 1978

## సిందూరం

నా కవితా సిందూరంతో
నెత్తురు మండిస్తాను
నా కవితా సంధ్యారాగంతో
దైన్యజీవన తిమిరచ్ఛటలు హరిస్తాను

నిజమే
కవిభజంత్రీలు
భజనలకు
పదసంపదంతా
తగలేస్తున్నారు
ఉద్యమాలు నడిపించాల్సిన శక్తితో
ఉన్మాదుల్ని పొగిడేస్తున్నారు

జీవితోన్మేషణలో
జీవన ఘర్షణలో
నెత్తురు వేడెక్కి వాడిగా
దూసుకుపోవాల్సిన కవి
చిత్తుగా తాగిన తిక్కలో
చీకటి పోగేసుకుంటున్నాడు
కిరాయికి నరహత్యలు చేస్తున్నాడు

దోపిడి నెదిరించి
అవినీతిని అణగించి
ఆశయాన్నుద్దీపించి
సమకాలీన ప్రజాజీవితాలకు
అద్దాలుపట్టాల్సిన కవి
రసస్ఫూర్తి లేని

రసస్యంది గాని
అశ్లీల శృంగారాన్ని
అర్థాని కాశించి
స్వార్థంతో
యువక జీవితాలపై
రుద్దుతున్నాడు

అయినా ఓ కవీ!
పట్టెడు మెతుకులు దొరకని కడుపును
గుప్పెడు డబ్బుల కమ్ముడుపోయి
ఎలా చిత్రించగలవు?

అందుకే
జాతి నైతికశక్తిని హరించే
పడుపు వృత్తిని
నిరసించగలిగిన వ్యక్తిత్వం
నల్లబారిన నీ నెత్తురులో లేనినాడు
జాతి మనుగడను శాసించాల్సిన నీవే
పతనమైననాడు
ప్రజలకు జవం జీవంపూన్చి
ప్రగతిపథంలో
"కదంతాల్" త్రొక్కించాల్సిన నీవు
అధోగతి పాలై
నల్లబజారులో తారాడునాడు
జాతికి మనుగడేది?

అందుకే ఓ కవీ!
నీవు వెలుగును చూడాలి

నీ ఆవేశంతో
జాతిలో నెత్తురు పొంగించాలి

నీ భావుకతతో
ప్రజాశక్తిని పండించాలి

నీ నిర్భీకతతో
దైన్యజీవన విముక్తిని చాటించాలి

నీ ఔన్నత్యంతో
జటిల మతాతీత సమసమాజ
నిర్మాణాన్నాశించాలి

కుటిల సంస్కార విషవృక్షాలను
ఖండించాలి

అప్పుడే
కవితాలోకంలో అభ్యుదయం
అభ్యుదయంలో సిందూరం

అందుకే– నా
కవితాసిందూరంతో
నెత్తురు మండిస్తాను

నా కవితా సంధ్యారాగంతో
దైన్యజీవన తిమిరచ్ఛటలు మారిస్తాను

"అభ్యుదయ"– జనవరి 1979

# గర్భగుడి

కరకుకత్తుల కెరమైన
కుత్తుకల నెత్తుటిచారలు
మాయలేదు-
బౌద్ధస్తూపాల తలలు తెగ్గొంచి
శివ లింగాలుగా రంగరించిన
ఉష్క్రహస్త్రాల కర్కశ కుటిలనీతియు
చెరగలేదు-

చరిత్ర గర్భాన కొనఊపిరితో
గిలగిలలాడుతున్న
సత్యనిగళాల గళాలు విప్పిచూస్తె....
నేటి ఆంధ్రుల మత సంస్కృతికి
రుధిర జ్యోతులు పట్టిన పంచారామాలు
నాటి బౌద్ధక్షేత్రాల సజీవ సమాధులు
బౌద్ధధర్మాల సుమాలు గుబాళించిన
ఆరామసీమలు-
ప్రజాసంస్కృతిని ప్రదీపించు
శిథిలశిల్ప బౌద్ధకళావేదికలు
అన్నట్టి సత్యాక్షరులు
నిప్పులు చెరుగుకుంటూ పారవే-

నేటి తలనీలాల ఇలవేలుపు
నాటి రామానుజుని చేతిమలుపు;
ఈ రంగారు బంగారు వెంకన్న
గర్భాన దాగిన లింగాన్ని
ఎవడు తెలుపు?

మన తెలుగుల చరితల బొగ్గు
గనులను త్రవ్వి చూడ
సత్యాల నిప్పుగుండాలెన్ని
అసత్యపు చరితల్ని
దగ్ధ మొనర్చినవో?

# చెరబడ్డ చైతన్యం

విప్లవం! విప్లవం!
ప్లవించేది విప్లవం
ధ్వనించేది విప్లవం
ప్లవించేది ధ్వనించేది
విప్లవ కంఠాల స్వరం
ఎదగొంతుక చించుకొని
నియంతలను చీల్చుకొని
దడుపులేక జడుపులేక
వెలుగు చిమ్ముకొంటుపోవు
జ్వలిత జ్వాలమాలికలే
విప్లవనాదాల స్వరం

వ్యధపూరిత గాధమయ
సూదులన్నీ
గుత్తులై ఉమ్మెత్తలై
గుండెను చిలికేస్తుంటే
మత్తులన్ని పారిపోయి
శక్తులన్ని నిండిపోయి
ఆకాశాన్ని భూమిని
తాళాలుగా వాయించే
చైతన్యాలనుండి
ప్లవించేది విప్లవం
ధ్వనించేది విప్లవం.

చెరలోపల చెరబడ్డ
అబల ఆర్తి వెల్లువగా

ప్రళయఘోష పెడుతుంటే
ఎదగోడలు పేల్లెత్తి - పేల్లెత్తి
పరుగెత్తి పరుగెత్తి
గాంధీగారి బొమ్మ క్రింద
దేశభక్తి చిహ్నంగా పాతేసిన
సోదరుడి గళమువిని గళమువిని
అహింస పుక్కగోడ వెనుక
చెరబడ్డ చైతన్యం
సూక్తులొద్దు ప్రవక్తలొద్దు
ప్రజలను మేల్కొలపండి
వెలుగును పండించడి
అనే
మాటలోన
బాటలోన
ప్లవించేది
విప్లవం
ధ్వనించేది
విప్లవం

# మహోద్యమం

మతమంటే మారణం
మనిషిమనిషి.కీ మధ్య
నిరంతరం జరుగుతున్న రణం
ఈ వ్యవస్థ వెన్నుపై పుట్టిన వ్రణం

పీడించటమే మతధర్మం
బానిసత్వమే మతసారం
దారిద్ర్యమే మతఫలం
దాస్యభావమే మతభాష్యం

మతం నుండి పుట్టింది అసమత్వం
మతం ఒడిలో పెరిగింది మూఢత్వం
మతం బడిలో చదివింది జడత్వం
మతం మడిలో దాగుంది అంధత్వం

ద్వేషం, క్రౌర్యం, ఊపిరిగా
మతరాజ్యాలు బ్రతుకుతాయి
అరాచకం అమానుషం
మతరాజ్యాలను పాలిస్తాయి

ఫ్యూడలిజం, క్యాపిటలిజం
మతాన్ని పెంచి పోషించాయి
విశ్వాసం అజ్ఞానం
మతం మత్తును వెదజల్లాయి

భారత క్షేత్రంలో ప్రభవించిన
ప్రతి శిశువును కాటేసి
చంపుతుంది మత సర్పం
మతం పుట్టలో పుట్టిన
కోట్లకోట్ల కులనాగులు
ప్రతిమనిషి రక్తాన్ని
విషయుక్తం చేస్తున్నాయి
మనిషిని మనిషిగా,
బ్రతుకనీయకున్నాయి

అందుకే,
సమసమాజ రణసేనలు
మతం మత్తులో చల్లారిన రక్తంతో
బ్రతుకుతున్న బడుగుజీవులను
పీడనకు తాడనకు గురైన తమ్ముళ్ళను
మేలుకొలిపి చేయిగలిపి
మతం పునాదులను పెకలించును
కదలివచ్చాయి ఉద్యమించాయి
మతం మత్తును వదిలించి
చైతన్యం రగిలించి
శ్రామిక రాజ్య నిర్మాతలు
మీరేనని తెలియజెప్పి
నడుస్తూ నడిపిస్తూ
కదులుతూ కదిలిస్తూ
రగులుతూ రగిలిస్తూ
మహోద్యమమై రగులుతున్నాయి
సమసమాజాన్ని నిర్మిస్తాయి.

# మేలుకొలుపు

వేడినెత్తురులో
విషం కుమ్మరిస్తుంది
మత్తుసాహిత్యం
వాడి కత్తులకు
పోరు రగిలిస్తుంది
కుల సమాజం
విద్వత్తుల విద్యుత్తులు
వెలిగించాల్సిన విద్య
సాయిగాళ్ళ సన్నాయిలు
మ్రోగిస్తుంది
విడ్డూరం?

గుండె కొలిముల్లో
రగలాల్సిన విజ్ఞానం
"సితార" "తార" ల్లో
విహరిస్తుంది
అన్యాయం?

చైతన్యాల అగ్గుల్లో
మండాల్సిన యువలోకం
తారల భజనల్లో
నిండిందా అజ్ఞానం

అందుకే
ఈ చెత్త సాహిత్యాల మత్తుల
మతబోధల కసరత్తుల
"సితార" "తార" ల గమ్మత్తుల

నుండి
ఈ యువలోకం మేల్కొనాలి
దారిద్ర్య దావానలాల
మానభంగ మారణహోమాల
నిరుద్యోగ జీవితసమరాల
వరకట్న దురాచారాల
దోపిడిసమాజాన్ని
కళ్ళువిప్పి చూడాలి
ఆనాడు పండుతుంది నిజంగా
యువతరం నిర్మిస్తుంది
నిజంగా నవలోకం.

# శవతాండవం

ఈరాతిరి
నడిరేతిరి
ఎవరికో శరీరమమ్మి
నివ్వెరబోయి చూస్తున్నావ్
అప్పుడే ఉతికేసిన చాకలి బండలా
నిగనిగలాడుతున్నావ్!
శివమెత్తిన వాడిపొంగు
ఏ పొంగూ లేని నీ నెత్తుటి తర్పణకు గానీ
చల్లారదేమిటనా?
అదంతే! అదంతే!

ఇదిగో విను
నేను కవిని
చల్లబడిపోయిన రవిని
మొక్కపోయిన పవిని
పాతపద్దులన్నీ తిరగేసి తిరగేసి
నా దేశంలో స్త్రీలకున్న పవిత్రతని
చప్పట్ల మధ్యలో
చదవడానికెళుతున్నా

మన సీత భగవద్గీతకంటే పునీత
దశకంఠుని మోహింపజేసిన ఘనత
ఆ పరిపూత దేహాకు మాయని చరిత

అదిగో...
పదునెన్మిది పర్వాల భారతానికి నాయిక

సుయోధన పరాభవేక్షణోత్సాహిక
పంచభర్తృక
పరిపూత యశశ్చంద్రిక

ఇదిగో....
నిశ్చల ధర్మనిష్ఠాగరిష్ఠుని భార్యామణి
సహస్రాక్షుని కాంక్షించిన గుణఖని
ఆ అహల్యా జారిణి
మన పురాణ కాంతాశిరోమణి

అదిగో....
సర్వశాస్త్రపారంగతుని పరమకళ్యాణి
శశాంకుని ముద్దుల భరణి
అనురాగాన్ని పలికించిన సితార
మన తార

ఆహా!
మన పురాణ పుణ్యాంగనల చరితలు
తరచితరచి చూడ నాకు
మేను గగుర్పొడుచుచున్నది
ఆనాడు
ఆశ్రమాలు
ఆరామాలు
ఫలాలు- పానీయాలు
దేవర్షులు- దేవవేశ్యలు
నిత్యం పవిత్రతను
పడవేసి కాల్చి నిలవేసే నిత్యాగ్నిగుండాలు
ఆహాహా!

వేదభూమి
కర్మభూమి
పుణ్యభూమి
భరతభూమి
భూమినుండి సీతపుట్టిన భూమి
ధర్మజుడాలిని జూదమాడిన భూమి
సుగ్రీవుడు వదిననేలిన భూమి

అంతేనా!
మరెందరో
పవిత్రులు
పరిపూతలు
పతివ్రతలు
ఘనచరితలు
విలాసినులు
వినోదినులు
రకరకాలు

అనుసరించేవారు
అనుకరించేవారు
నిన్ను వేలెత్తిచూపేవారు
చివరకు కాలెత్తి భర్తను తన్నేవారు
వాళ్ళు పురాణకాంతలైపోయారు
వాళ్ళు పురాణపురుషులైపోయారు

నిజమే
నీకు జరిగిన అన్యాయాన్ని
అక్రమాన్ని
చిత్రించే సాహసానికి

పూనుకోని నేను
నిన్ను సంప్రదాయపు పద్దులో చేర్చేస్తున్నాను
అష్టాదశ వర్ణనలలో అవకాశం కల్పిస్తున్నాను
నిన్ను దేవవేశ్యగా చిత్రిస్తున్నాను
నీ తర్పణను దేవతార్పణగా పొగిడేస్తున్నాను

అంతేకాదు
మరొక పరమసత్యం
నీవు దేవవేశ్యవైపోయావు
సంప్రదాయం చావకుండానే వస్తుంది
ఇంకా
శవసంస్కృతి తాండవిస్తూనే ఉంది.

1978 జనవరి

# పోరులో గెలవండి

జనంకై పోరుతాం
జనంకై బతుకుతాం

మా శక్తి మా జీవం
జనంకే అర్పిస్తాం

అదుగో మన సోదరులు
కొండల్లో బండల్లా
బండల్లో బల్లుల్లా
చచ్చి బతుకుతున్నారు
బతికి చచ్చిపున్నారు

గానుగల్లో ఎద్దుల్లా
చిగురించని మొద్దుల్లా
బానిసలై తలవంచి
కూడు లేక గూడు లేక
కడుపులన్నీ ఎండగట్టి
కాలమీడ్చుతున్నారు

ఊరకండి ఉరమండి
పెల్లుబికిన వెల్లువలా
కొండలన్నీ తొలుచుకొంటు
బండల్లో దూసుకుంటు
రగలండి పేలండి
గంధకపు కొండల్లా
బందీకృత సింహాల్లా

ఈదండి ఈదండి
సుడితిరిగిన సంద్రాల్లా
పెడతిరిగిన జీవితాలు

ఒక్కరుగా పోరకండి
ఒంటరిగా పోరకండి
తెగబలిసిన ఎలుగుబంట్లు
మింగేస్తాయ్ నమిలేస్తాయ్

కలిసి కట్టుగా రండి
కదనం సాగించండి

కులంలేని మతంలేని
బీదలేని సాదలేని
సమసమాజ నిర్మాణపు
పోరాటం చేయండి
పోరులోన గెలవండి

1978 మే

# సమరం

మతాల మారణహోమం
విలయతాండవం చేస్తోంది
కులాల కుమ్ములాటల
ప్రళయఘోషలు రేపుతోంది

ఏమిటీ!
గుండె చెరువయ్యే దృశ్యాలు
మనుష్యులు గుంపులుగుంపులుగా చీలి
మానవత్వాన్ని మంటకలుపుతున్నారు
ప్రతి గుంపు ఇంకొక గుంపును
దుంపనాశనము చేయాలని
పళ్ళుకోరలు నూరుతోంది
దోసిళ్ళతో గుండెనెత్తురులు
జుర్రాలని ఉవ్విళ్ళూరుతోంది

మత సంస్థలు విజృంభించి
కులతత్వాన్ని పశుత్వాన్ని
పెంచి పోషిస్తున్నాయ్
క్రమశిక్షణ పేరుతో
మనిషిమనిషికి మధ్య
మంటలు రేపుతున్నాయ్

భక్తి పేరిట– ముక్తి పేరిట
శక్తులన్నీ నిర్వీర్యం చేస్తున్నాయ్
పండగ పేరిట– పబ్బం పేరిట
పచ్చిఛాదస్తాన్ని రుద్దుతున్నాయ్

పవనం పేరిట- హవనం పేరిట
సమరాన్ని రేపుతున్నాయ్
క్రతువుల పేరిట- కర్మల పేరిట
కత్తులు పెంచుతున్నాయ్
ఆత్మల పేరిట- అమృతం పేరిట
అనృతాలు కూస్తున్నాయ్
మంత్రం పేరిట- తంత్రం పేరిట
కుతంత్రాలు చేస్తున్నాయ్
ఉత్సవం పేరిట- ఉరుసుల పేరిట
ఉన్మాదాన్ని పెంచుతున్నాయ్
ధర్మం పేరిట- కర్మం పేరిట
దారిద్ర్యాన్ని పోషిస్తూన్నాయ్

అందుకే
విషపూరిత మతవిద్వేషం మాయాలి
విప్లవాల విద్యుత్తులు రగలాలి
కురూప విరూపాక్షులు పగలాలి

సమసమాజ నిర్మాణం
జరగాలి
జరగాలి
జరగాలి

1979 ఆగష్టు

# ఇదీ మన సంస్కృతి

ఓహోహో! మన సంస్కృతి
మృతజీవుల గత సంస్కృతి
మానవుడు పుట్టకముందరి భాష్యం
గిట్టినతరువాతి జోస్యం
ముడివేసిన దాస్యమే- మన సంస్కృతి

ఇది....
అపౌరుషేయమూ కాదు
పురుషకారమూ కాదు
ఆ లేనిదానితో ఈ ఉన్నదాన్ని అరికట్టడానికి
ఒక వెల్లిగాడల్లిన కల్ల

అందుకే....
మతం మత్తు- గతం చిత్తు
నీ సత్తు- నీ చిత్తు
అదంతా ఒక గమ్మత్తు
చెత్త కథల కసరత్తు
సత్తాలేనోడికి మత్తు!

భౌతికాన్నే మాయంటావ్
రాతిబొమ్మల కొలువుజేస్తావ్
జాతినంతా దోచుకుంటావ్
నీతిమాలిన గతి చరిస్తావ్

కత్తివాదరవంటి సత్యానికి
వెరచే ఓ భీరువా!

భౌతికత్వపు వాస్తవమే
జీవితానికి జీవమోయ్
అది లేనినాడు- నీవు
జీవచ్ఛవానివోయ్

మూఢభావాల ముల్లుకఱ్ఱ
గుచ్చనడిచే ఓ నర్రా!
సొంతబుద్ధిలేని ఓ వృద్ధా!
గానుగపు ఎద్దులాగా
చిగురించని మొద్దులాగ
సంప్రదాయాల పద్దునుండి
బయటపడలేని- ఓ
చేతనములేని సనాతనా!
యుగచైతన్యం ధ్వనిస్తుంది
మృతభావం నశిస్తుంది

నువు సృష్టించిన
కోట్లకొలది దేవతలు
దేశాల వెంటబడి
గంజాయి మత్తెక్కించి
మమ్మల్ని నమ్మమంటున్నాయ్
చిమ్మచీకట్లో కుమ్ములాటెందుకోయ్
నాస్తికత్వపు కాంతిలో
వాస్తవాన్ని గుర్తించవోయ్

1977 డిశంబర్

# నవయుగ కవిచక్రవర్తి

రసభావోన్మేష వచస్వీ
సరస కవన సముపార్జిత యశస్వీ
సజీవ కళారాధనా తపస్వీ
జాషువా మనస్వీ

ఓ కవిపీష్వా! జాష్వా!
నీ కవిత తేజస్వీ
నిర్ఘరఝరీ జాయమాన కవితా నిర్మాతవు
ఓహో! రసమయ కవన నిర్మాణ నిష్ణాతా!
జాషువా కవీ! కవిలోక రవీ!
మధుర మరంద ధారలు స్రవించే
నీ కవితాగానం
నిండిన తెనుగు గుండె
'నవయుగ కవిచక్రవర్తీ' అని నినదించిందోయి

పదపదమున నీవు ఝుళిపించిన
ఝుళంఝుళులు- గళగళమున
రవ్వల కువ్వల జడిగా
వర్షించాయోయి!

ఓ కవీ! సజీవీ!
నీ హృదయం- నీ భావం
నీ రావం- నీ గానం
రాగబద్ధం- త్యాగసిద్ధం

కుటిలతంత్రపు కులతత్త్వాలను
మతోన్మాదుల కుతంత్రాలను
కూల్చి పేల్చి రగల్చాలని
ఆవేదనతో ఊగిపోయి
కేకలేశావే

కడజాతిగోడు సుడులుతిరిగి
కడలిహోరు నీ నుడిలో గింగురంటే
గబ్బిలాలు ఆలకించి
విశ్వమంతా ఒకేజాతని
గుండెగుండెకు నిబ్బరంగా నివేదిస్తున్నాయ్!

మధురమధురం
లలితలలితం
మధుర "శ్రీనాథీయం"
నీ "సీసం"
రసాలం రసమయం
మూసపోసిన హర్షధ్వానం

ఓ రసధునీ!
వజ్రఖనీ!
తేటతెనుగుల తీయదనము
జానుతెనుగుల జాణతనము
నీనుడులే- నానుడులై
చెలగిన కవిజనకుడ వీవుగావా!

కవికుమార జనకా!
కనకాభిషిక్తా! కవిదిగ్గజా!

కళాప్రపూర్ణా! పద్మవిభూషణా! అని
సారస్వత లోకం
వేలగొంతులు విప్పి మ్రోసింది

నీ వెక్కితివోయి
మత్తగజాలు
మగటిమిగల పగటిదివిటీల పల్లకీలు
గుండెవిరిచి- జబ్బచరిచి
పలుకుపలుకుకు- తేనెలొలుకు
తీయ తెనుగును చిలకరించి
కూయుచుంటివి కవికోకిలగా!

అందుకే
విశ్వప్రభాతంలో
విశ్వమానవతా గానంచేసే కోయిల
నీ పాట నేర్చుకుంది

తరతరాలు- యుగయుగాలు
మనసుమనసున మమత రేపుచు
ఆ మధురగానం
విశ్వమంతా మారుమ్రోగాలి
విశ్వమంతా నిండిపోవాలి
విశ్వకవిగా నీవు వుండిపోవాలి?

"తెలుగు విద్యార్థి"- జనవరి 1979

మానవతా! ఓ మానవతా!
వినిపించే మానవతా!
కనిపించని మానవతా!

కనిపించే సుగుణం నీలో
సుంతైనా లేదా మానవతా!

రాతియుగంనుంచి
రాకెట్ యుగందాకా
వైజ్ఞానిక ప్రగతిలో
గమనిస్తూనే వున్నాము- మానవతా!

యుగాలు మారినా
తరాలు మారినా
భావాలు మారినా
భావి యెంతమారినా
నీవురావా? అసలులేవా? మానవతా!

చంద్రలోకం వెళ్ళి
శిలలు తెచ్చిన మాకు
నీ ఉనికే తెలియదాయె

సూర్యగోళానికి దారితీసిన మాకు
నీ దారే కనరాదాయె

ఉష్ణసముద్రంలో
ముత్యాలేరే మాకు
నీ లోతే తెలియదాయె

లోతు తెలియని మానవతా!

చరిత్రగతిలో నీ పాత్ర విశిష్టమన్నారు
మమతకు మరోపేరే నీవన్నారు
మనసులో పుడుతుందన్నారు
జ్ఞానాన్ని పొందిపొంది
విజ్ఞానాన్ని తరచితరచి
నీ రూపు తెలుసుకున్నా
నిన్ను చూపించలేరు

నీ అందాన్ని ఆస్వాదిస్తే
బ్రహ్మానందమన్నారు
నీ రూపురేఖలు కొలిచిచూచి
నిన్ను అనుభవించలేరు

కవుల కలాలు నిన్నుగూర్చి
వ్రాసివ్రాసి మూలుగుతున్నాయి
కవితలెన్నో నిన్ను పాడిపాడి
జీరవోయాయి
మతాలెన్నో నిన్ను చెప్పిచెప్పి
తప్పుకున్నాయి

అందుకే- మానవతా!
నీ కోసం వచ్చివచ్చి నాకు

పిచ్చెక్కినట్లుంది
మత్తేదో క్రమ్మింది
చిత్తుగా త్రాగినోడిలా
నా గుండెను నేనే కత్తిరించుకున్నాను

చిత్తై నిన్ను నేను
'మానవతా! మానవతా!' అని పలవరిస్తుంటే
పక్కింటి అవధానుల కూతురు పేరు
"(మా) నవత" కాబోలు- నాకేం తెలుసు
నేను పలవరిస్తూనే వున్నాను

పండ్లూడిన అవధాని
పంచె యెగగట్టి
కొట్టొచ్చాడు నన్ను

పేరుగానే మిగిలిన మానవతా!
నిన్ను పలవరించినా-
"డేంజరే"

1975 మార్చి

# డా॥ కోవూర్

ఓ హేతువిద్యాకరా!
మూఢ భావాంధకార నిర్మూలనాభాస్కరా!
డా॥ కోవూర్

నీవు లేకున్నా
నీ బోధామృతం గ్రోలిన
హేతుమతుల నరాలు
విద్యుల్లతల్లా ప్రకాశిస్తున్నాయ్
గుండెలు
అగ్నిగోళాల్లా ప్రజ్వలిస్తున్నాయ్
సత్యనిరూపణకోసం నీవు
అహరహం
హారతికర్పూరంలా ఆహుతిఅయ్యావు
నిప్పుకణాల్లా నీ కళ్ళు
అభూతకల్పనావాదుల దూడుల్లో
విహరించాయ్- హరించాయ్!

హేతువుకోసం సింహేంద్రంలా
నీవు గర్జించినపుడు
బాబాల నక్కలు
బొరియల్లోదూరి మూల్గాయి
కలకత్తా కాళిక నాల్క చీల్కలయి
నెత్తురుచిందింది

సప్తగిరి నల్లబజారులో 'రద్దీ' ఎక్కువైంది
మతి గతిలేని మంత్రతంత్రశాలల్లో

మతపిచ్చగాళ్ళ మద్యపానశాలల్లో
దిగంబర నర్తకులు
వస్త్రాన్వేషణ ప్రారంభించారు

*జిల్లెళ్ళమూడి అమ్మ పెళ్ళాలతో
క్రీడలాడుతుంటే-
భజనచేసే భక్తులందరు
'హోమోసెక్స్' అని అనుమానిస్తున్నారు

మూఢనమ్మకాల
ఇనుపపొరల మధ్య
అణగిమణగిన
మానవ మేథస్సు
ఇప్పుడిప్పుడే- బలంపుంజుకుంటుంది

అందుకే- కోవూర్!
నీ ప్రబోధ భేరీభాంకారానికి
నిదురమత్తులో చిత్తయిన నిర్భాగ్యపు మూక
కన్ను తెరచింది
కాలి సంకెళ్ళు సడలించుకుంటోంది.

---

*జిల్లెళ్ళమూడి అమ్మగారు శివరూపమనే
నమ్మకముతో భక్తులు పార్వతి గంగలని
ఇద్దరు అమ్మాయిలను పెళ్ళిచేశారు. ఆమె
వారితో కాపురం చేస్తుంది

# కడుపు తీపి

అద్ద రేతిరి కాడ
వల్ల కాడూలోన
అంగాలిన పీనుగుల
పడదోసి కాలుత్తుండు
వోడురా... వాడు?
బారతమ్మోరి కడగొట్టు కొడుకా!?

పెద్దోళ్ళు నలుగురు
వెలిబెట్టి వాణ్ని
కూడు లేకుండా
గుడ్డ లేకుండా
అంటకూడదని
వల్లకాడుదాక
తరిమితరిమి కొడుతుంటే
బారతమ్మోరు సోద్దెంగసూత్తా
నవ్వుతుందేరా?
బిడ్డల్నిగందా! గడ్డల్నిగందా!

ఓరురా? బుడ్డోడు కేకలేత్తున్నడు
ఓరురా! ఆ పడతి
అద్ద రేతిరి కాడ
చీరిన వొంటితో
వొళ్ళమ్మటానికి
వెళ్ళనంటున్నది

వెళ్ళితే వాళ్ళు- నెత్తురంతాను
జుర్రుతారని బెంబేలుపడుతున్నాది
ఆ బుడ్డోడు భారతమ్మోరి కూతురు బిడ్డడా?
ఆ బుల్లెమ్మ భారతమ్మోరి కన్నకూతురా?

ఎంత విడ్డూరం?

పాలబుడ్డికోసం
కూతురు గడ్డంబట్టి
వాళ్ళమ్మకోడానికి
బతిమాలి పంపుతుందా!
ఈ కన్నబిడ్డల్ని తార్చే కర్కోటకురాలు
బిడ్డల్నిగందా! గడ్డల్నిగందా!
ఓడురా! చూడు!
అర్ధరేతిరికాడ
కొలిమితో- కాలేకడుపుతో- వాడు
సత్తువలేకుండానే
సుత్తితిప్పికొడుతున్నడు-
భారతమ్మోరి సవతిబిడ్డడా!
ముక్కోటి దేవతలకు
ముప్పూటల పెట్టే
పెసాదమన్నా- వాడిమొకానేయదు
బిడ్డల్నిగందా! గడ్డల్నిగందా!

# స్వేచ్ఛామయ మిదం జగత్

పులులు లేళ్ళను చీల్చి
స్వేచ్ఛగా నెత్తురు పుడిసిలిస్తుంటే
తోడేళ్ళు మేకపిల్లల నల్లను
జుర్రి స్వేచ్ఛగా ఆవులిస్తుంటే
స్వేచ్ఛ కెంతక్కువ?

ఆహా! స్వేచ్ఛ!! ఓహో స్వేచ్ఛ!
ఎక్కడచూసినా స్వేచ్ఛ!!
ఏ నోటవిన్నా స్వేచ్ఛ!!

చిన్న చేపను తినడానికి
పెద్దచేపకు స్వేచ్ఛ!
పెద్దోడికి దోపిడితో పెరిగిపోవడానికి స్వేచ్ఛ!
చిన్నోడి తిరుగుబాటు నణచడానికి స్వేచ్ఛ
పాలకులు నియంతలుగా మారడానికి స్వేచ్ఛ
నియంతలు పాలకులవడానికి స్వేచ్ఛ
సత్యాన్ని అసత్యంగా నిరూపించడానికి స్వేచ్ఛ
అసత్యాన్ని సత్యంగా నిరూపించడానికి స్వేచ్ఛ
ఆహా! ఏమిస్వేచ్ఛ! ఓహో ఎంతస్వేచ్ఛ!!
రక్షించేవాడికి భక్షించే స్వేచ్ఛ
భక్షించేవాడిని రక్షించడానికి స్వేచ్ఛ
మానభంగాలకు స్వేచ్ఛ
మారణహోమాలకు స్వేచ్ఛ
ప్రాణం తీయడానికి స్వేచ్ఛ
కిరాయిగూండాలకు స్వేచ్ఛ

అవినీతికి స్వేచ్ఛ
అహంకారానికి స్వేచ్ఛ
అజ్ఞానానికి స్వేచ్ఛ
ఆత్మవంచనకు స్వేచ్ఛ
ఆహా స్వేచ్ఛ! ఓహో స్వేచ్ఛ!
స్వేచ్ఛామయం ఇదంజగత్.

•••••••

# !?

పుణ్యభూమిలో పుట్టిన జీవికి
పులిస్తర్లు ఫలమా!?
కర్మభూమిలో పుట్టిన జీవికి
కడుపుమంట వరమా!?
వేదములు ప్రభవించిన గడ్డకు
బానిసత్వం ఫలమా!?
ఋషుల వాక్కుల తడిసిన నేలకు
దారిద్ర్యం వరమా!?

# ?

ఏమిటీ
ఉద్యమాలు
ఉద్దేశాలు
జనంమీదుగా పోతున్నాయ్
జనంతో కలిసి
జనంలో నిలిచి
నిజంచెప్పే సాహసం
కనిపించడంలేదు
ఏ ఉద్యమం
జనానికర్థంకావడంలేదు

నినాదాలు
నిందలు
తప్ప
నిజాయితీగా
నిజం చెప్పడం
ఉద్యమాలకలవాటు తప్పింది!

ఉద్యమాలకోసం
వ్యక్తులు త్యాగం
చేయటం
వెనకటి సిద్ధాంతమైతే
ఉద్యమాన్ని

వ్యక్తులు ఉపయోగించుకోవటం
నేటి రాద్ధాంతం!

నిజాయితీగల
పులులన్నీ
అజ్ఞాతవాసంలో
కాలం గడుపుతోంటే
నక్కలుమాత్రం
బయలుదేరి
జనం వెనకో
జనం ముందో ఉండి
జనాన్ని కంగారు
పెడుతున్నాయ్

నాయకులు వినాయకులై - సామూహికంగా
సామాన్యుడ్ని
దోచుకొంటుంటే
సామాన్యుడు మాత్రం
నోరుతెరచి
"అణుబాంబులకోసం"
ఎదురుచూస్తున్నాడు

ఇంతమంది పీల్చుకొనే రక్తం
ఒక్కసారి గడ్డకడితే
బాగుండునని
ఊహాలు పోతున్నాడు

కాని
ఈ రక్తాన్ని విప్లవాలకోసం మండించి
విజయాలు సాధించడానికి
సాయుధుడవలేకపోతున్నాడు.

# తిరోగతి - పురోగతి

అంతరిక్షంలో
నక్షత్రాలు
ఆంతరంగికచర్చలు చేస్తున్నాయ్
తమ్మునడిపించే
అభౌతిక శక్తి
వేరే లేదని
చాటిచెబుతున్నాయ్

బుక్కులు
పేకముక్కలు
భజనచెక్కలు
ముసలినక్కలు
ముముక్షువునిగూర్చి
ఘోషిస్తున్నాయ్
భౌతికం అవాస్తవమంటున్నాయ్

జీవితం- జీవనం- సాంఘికం
మనిషిని బ్రతుకమంటున్నాయ్
బ్రతుకుపోరాటంలో గెలవమంటున్నాయ్

స్వర్గం- నరకం
అభౌతికం- ఆధ్యాత్మికం
మనిషిని చావమంటున్నాయ్
చచ్చి స్వర్గంలో బ్రతుకమంటున్నాయ్

ఆటవికం- అనాగరికం
గణసంచారం- కుటుంబ జీవితం
పరిణామాన్ని బోధిస్తున్నాయ్
ప్రగతిని కాంక్షిస్తున్నాయ్!

# రాచంబట్లు

మన రాచంబట్లు [1] బటాచోరులైనరు
కల్లబొల్లి కబుర్లతో జనాన్ని [2] జల్లకొడుతున్నరు
సడీచప్పుడు లేకుండా [3] తడి కలవాటుపడినరు
పొద్దత్తమానం జనం సవురుకై ంకర్యం చేస్తరు
పొద్దుకుంకకముందే జోరుగా గుత్తాలెక్కుతరు
కడుపేదోళ్ళ బతుకులను [4] అద్దద్దనే ఉద్దరిస్తమంటరు
బడాపెద్దోళ్ళ గాదెలకు కాపలా కాస్తుంటరు
[5] బాలీసులమీద చేరి దగాకోరుకూతలను
[6] రోకంటిపాట పాడతరు
ఏమేటికామేడు నాపసానిమాటలతో
[7] డీలా చేస్తుంటరు
రాబందుల్లా జీవచ్ఛవాలమీద పడి కుతితీర్చుకుంటరు

అందుకే
ఈ పితలాటకంగాళ్ళ ఆకతాయి
మాటలన్నీ తూర్పారపట్టాలి
ఈ [8] దంభోళిగాళ్ళ జిత్తులమారి
నీతిలేని కూతలను ఊడ్చిపారేయాలి
ఈ బటాచోరుల గుట్టును బట్టబయలుచేయాలి.

---

(1) బట్టను దొంగిలించేవాడు (2) దెబ్బకొడుతున్నారు
(3) లంచం (4) వెంటనే
(5) పొడుగాటి దిండ్లు (6) చెప్పిందే చెబుతారు
(7) ఆలస్యం (8) పోచుకోలుకబుర్లగాళ్ళు

# చండ్రనిప్పులు

ఎండాకాలం- మండేకాలం
చండ్రనిప్పులు చెరిగేకాలం
గుండెలన్నీ ఎండేకాలం- కండలన్నీ కరిగేకాలం!

నీళ్ళులేని ఊళ్ళు
నీటిచుక్కలేని కావిళ్ళు
నాలుక తడారడానికి
మైళ్ళమైళ్ళదూరాలనుండి
తెస్తున్న నీటిపీపాల బళ్ళు
రాళ్ళుకూడా నోరుతెరచి
నీటిచుక్కకోసం తపిస్తున్న పగళ్ళు

బొగ్గుగనిలో మగ్గిపోయే కళేబరాలు
మగ్గం గుంటలో ఉక్కపోయే కాయాలు
మట్టిపనిలో రెక్కలువిరిసే కర్షకులు
రైలుబళ్ళకు బొగ్గుగొట్టే డ్రైవర్లు
పొట్టకోసం గుండెబట్టుకు
జీవిస్తున్నారు

ఎంతవిలయం- ఎంతప్రళయం
పసికందులు వేడిని భరించలేక
తల్లి గర్భమందలి చల్లదనాన్ని
తలచుకొంటున్నారు

అందాకా ఎందుకు
ఒక్క మానవులే కాదు
ప్రాణులన్నీ ప్రాణాలన్నీ
బిగబట్టి బ్రతుకుతున్నాయ్.